Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మే నెల 30 వ తేదీ శుక్రవారం [నె 11 రు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

బ్రిటిషు విమానాలు 21 వ తేదీ బుధవారం నాడు హెలిగోలాండు దీవులపై పెద్ద దాడి జరిపాయి. ఆ దీవి, జర్మను యుద్ధ నౌకలకు ప్రధాన కేంద్రం. క్రిందనుండి జర్మను శతఘ్నులు రివ్వున ఆకాశం మీదకు అగ్నిగోళాలను విరజిమ్మడానికి ప్రారంభించాయి. ఒక బాంబు నాల్గు శతఘ్నుల్లుగల బాటరీమీద పడి పూర్తిగా ధ్వంసం చేసింది. వందలకొలది విమానాలు ఫ్రాన్సు ఉత్తర భాగం పైకి వెళ్లి దాడి సాగించాయి. శత్రువిమానాలు తీరంవద్ద ఆటంక పరచాయి. కాని పూర్తిగా చివరవరకు ఆపలేక పోయినవి. ఈ పోరాటంలో 6 శత్రు విమానాలు శిథిలం చేయబడెను. 7 బ్రిటిషు విమానాలు కన్పించుట లేదు. శుక్రవారం పగలు హాలండు తీరమునన్న జర్మను నౌకలపైనను, నాటి రాత్రి, కొలోన్ మొదలగు జర్మనీలోని పారిశ్రామిక ప్రదేశములపైనను బ్రిటిషు విమానాలు దాడి జరిపాయి. వానివలన కోస్తా రేవులకు చాల నష్టం కలుగుటయేగాక ఒక నూనె నౌక శిథిలమై పోయింది. శనివారం రాత్రి పరాసు కోస్తా రేవులన్నిటినిగూడ బ్రిటిషు విమానాలు వేలకొలది బాంబులతో, పరశురామ ప్రీతి చేశాయి. ఆదివారం రోజున బ్రిటిషు విమానాలు, కోస్తా రేవులపై దాడి సాగించినపుడు 6,000 టన్నుల శత్రు నౌక యొకటి ముంచి వేయబడెను. డెన్మార్కు తీరాన 4,000 టన్నుల నౌక యొకటి బాంబులచే దరికొనిన అగ్నిజ్వాలలచే పూర్తిగ తగులబడిపోయెను. 27, 28 వ తేదీలలో జర్మనీలోని కొలోను, మొదలగు ప్రాంతములలోని ఫాక్టరీలపై బాంబుల వర్షము కురిపింపబడెను. పరాసు తీరమున శత్రుయుద్ధ నౌకల తైనాతీతో ప్రయాణమొనర్చుచున్న 5,000 టన్నుల సప్లై నౌక విమానములచే ముంచివేయబడెను.

ఐరోపా దేశాలలో వాతావరణం ఏమీ అనుకూలంగా లేక పోవుటచేత బ్రిటనుపై శత్రు విమాన దాడులు చాల తగ్గిపోయెను. లండను నగరంమీద అసలు దాడులే జరుగలేదు. 21, 22, 23 వ తేదీలలో బ్రిటనుయందన్ని ప్రాంతాలు ప్రశాంతముగ నుండెను. శనివారం రాత్రి తూర్పు ఆంగ్లియాలోను, మిడ్లండ్సునందొక చోటను మాత్రం స్వల్పంగా బాంబులు పడెను. కాని నష్టం ఎక్కువ కలుగలేదు. ఆదివారం పగలు కొన్ని శత్రువిమానాలు ఇంగ్లండు పైకి వచ్చినవిగాని బాంబులు వేయలేదు. 26 వ తేదిన బ్రిటిషు కోస్తా పట్నాలమీద శత్రువులు, క్రొత్తరకపు విమానాలుపయోగించి స్వల్పంగా దాడులు సాగించారు. ఒక తూర్పు తీరపు పట్నంలో ఆస్తికి కొంత నష్టంకలిగింది. 27, 28 వ తేదీలలో గూడ, బ్రిటనుపై చాల స్వల్పముగు దాడులే జరిగెను. చెప్పదగినంత నష్టమేదియు కలుగలేదు.

ఇటీవలి శత్రు విమానదాడులలో లండనునందలి "రాయల్ కాలేజి ఆఫ్ సర్జన్సు" చాల నష్టపడి శిథిలమై పోయినది. పలురకముల వ్యాధుల గురించిన వస్తుప్రదర్శనశాల యంతయు నాశనమైనది. లండనునందలి పెద్ద వైద్యశాలలలో నొకటి యగు మిడిల్ సెక్సు వైద్యశాల పై రెండు పెద్ద బాంబులు పడి కొంతభాగమును శిథిలమొనర్చెను.

### ఆఫ్రికా, మధ్యధరా ప్రాంతములు.

ఉత్తర ఆఫ్రికాయందు, లిబియా- ఈజిప్టు సరిహద్దుప్రాంతములలో ఉభయపక్షములకును చిన్నచిన్న పోరాటములే ఇంకను సాగుచున్నవి. 20 వ తేదీ రాత్రి బ్రిటిషు గస్తీ దళములు సోలం పర్వతంమీద నున్న శత్రు శిబిరమును కూల్చి హతమార్చి, 3 టాంకుల ధ్వంసమొనర్చిరి. ప్రతిదినము పెద్ద పెద్ద ఇసుకతో గూడిన సుడిగాడ్పులు అధికంగా వుండుటవలన సోలం ప్రాంతమునగాని, టోబ్రూకు రేవువద్దగాని, యుద్ధమునకు అనుకూలముగలేదు. 23 వ తేదీన జర్మనులు టాంకుల నుపయోగించుచు ముందుకు ప్రయత్నించిరికాని అపారమైన నష్టంతో వెనుకకు తిరుగగొట్టబడిరి. 27 వ తేదీన జర్మను సైన్యములు టాంకులతో దాడి ప్రారంభించెను. కొలది మైళ్లు ముందుకు చొచ్చుకొనివచ్చినవి. సోలంను శత్రులు ఆక్రమించిరి.

22 వ తేదిన ఇటలీరేవులనుండి లిబియాకు సైన్యములను, మందుగుండు సామగ్రిని తీసుకొనిపోవుచున్న ఒక సప్లై నౌకను, ఒక నూనె నౌకను, బ్రిటిషు జలాంతర్గామి ముంచివేసెను. వానితో నున్న శత్రుల డిస్ట్రాయరు నౌకగూడ బహుశా ముంచివేయబడియే యుండునని బ్రిటిషు అధికారులు తలంచుచున్నారు. 26, 27 వ తేదీల బ్రిటిషు విమానాలు జలాంతర్గాములు, లిబియాకు సప్లైల చేర్చుచున్న 18,000 టన్నుల శత్రు నౌక నొకదానిని ముంచివేసెను. దానిలో 3,000 సైనికులుందురు. మరి 5,000 టన్నుల నౌకలు రెండు 4,000 టన్నుల నౌక యొకటి గూడ ముంచివేయ బడెను.

మధ్యధరా సముద్రమునందలి క్రీట్ ద్వీపముమీద జర్మనుదాడి ఇంకను రానురాను తీవ్రమగుచున్నది.

జర్మను సైన్యములు 20 వ తేదీ ఉదయంనుండి, గ్రీసుతీరపు రేవులనుండి విమానాలలోవచ్చి, క్రీటు ద్వీపములో అచ్చటచ్చట దిగుటకు ప్రారంభించిరి. మొదటి రోజున దింపబడిన 1,500 సైనికులలో హతులైనవారు పోగా మిగిలినవారు పట్టుకొనబడిరి. కాని, అప్పటినుండియు ప్రతిదినము, వేలకొలది సైనికులను, జర్మనులు ఆకాశమునందచటచట దింపుచుండిరి. నౌకలలోగూడ సైనికులను ఆయుధ సామగ్రిని తెచ్చి దింపుటకు ప్రయత్నించిరిగాని, బ్రిటిషు నౌకలు అడ్డుకొట్టి చాల భాగముముంచివేసెను. మిగి

లినవి మరలిపోయెను. క్రీటునందలి విమానాశ్రయములు సౌకర్యముగ లేనందున, అచటనున్న బ్రిటిషు విమానములన్నియు 23 వ తేదీన ఈజిప్టునకు మరలిపోయెను. గురువారము నాటిసాయంత్రమునకు, ఒక్క మెలమీవద్ద తప్ప, ద్వీపమునందలి మిగిలిన ప్రాంతములో దింపబడిన సైన్యమునంతను బ్రిటిషు గ్రీకు సైన్యములు శిథిలపరచి పూర్తిగ స్వాధీనపరచుకొనెను మెలెమీయందుమాత్రం విమానాశ్రయం జర్మనుల చేతులోనేయుండెను. కాని బ్రిటిషు ఫిరంగులనుండి, ఆ విమానాశ్రయముపైన గుండ్లను వర్షించుచుండిరి. 26 వ తేదీవరకును, ఉభయపక్షాలకును ఈ విధముగనే భయకరమగు పోరాటము జరుగుచుండెను. ఆనాడు జర్మను విమానములు కొన్ని 'టాంకు' లను ఫిరంగులను కూడ కొంతవరకు దింపగలిగెను. బ్రిటిషు యుద్ధ నౌకలు క్రీటు చుట్టు కాపలా కాయుచూ, సైన్యమును సప్లయిలను చేర్చుచున్న శత్రు నౌకల ముంచి వేయుచున్నవి. ఈ విధముగ అనేక వేల జర్మను సైన్యం ముంచివేయబడెను. ఈ పనిలో 2 బ్రిటిషు క్రూయిజరు నౌకలు 4 డిస్ట్రాయరు నౌకలు మునిగి పోయెను. ఇంకను చాల నౌకలకు దెబ్బలు తగిలెను. 28 వ తేదీన క్రీటు పడమటి ప్రాంతపు పరిస్థితులు విషమముగ నున్నవనియు, అచటకు బ్రిటిషు అధికారులు క్రొత్త సైన్యముల పంప నిశ్చయించుకొనిరనియు ప్రకటింపబడెను. గ్రీసు రాజు కొందరు మంత్రులతో కలసి, క్రీటును వదలి 25 వ తేదీన ఈజిప్టు చేరెను. విజయసిద్ధివరకును పోరాటము సాగించుటకు తాను దేశము వెడలి పోవుచుంటిననియు, తుదివరకు శత్రుల నెదిర్చి పోరాడవలెనని క్రీటు ప్రజలకును అచటనున్న గ్రీకు సైన్యములకును అతడు విజ్ఞప్తిగావించెను.

అబిసీనియా రంగమునందు బ్రిటిషు సైన్యములు శత్రుల వెంటాడి మరికొన్ని ప్రదేశముల నాక్రమించెను 22 వ తేదీన జిమ్మా ప్రాంతపు రంగమున, ఉత్తరమునుండియు, దక్షిణము నుండియు చుట్టుముట్టి వచ్చిన బ్రిటిషు సేనలమధ్య, చాల వేలమంది ఇటాలియను సైనికులు చిక్కుకొనిపోయిరి. గోండార్ ప్రాంతపు రంగమున ఒక చోట జరిగిన పోరాటములో 4,000 మంది ఇటాలియను సైనికులు చాలఆయుధ సామగ్రి బ్రిటిషువారిచే జిక్కెను. హల్లు అనే ప్రదేశం మీద జరిగిన దాడిలో 90 ఇటాలియనులు 1,300 దేశీయ సైనికులు ఒక బ్రిగేడియరు ఖైదీలుగా పట్టుకొనబడిరి. డెస్సీ-గోండారు దగ్గములమధ్య మాగ్సలా ప్రాంతమున జరిగిన పోరాటమున 800 ఇటాలియ సైనికులు పట్టుకొనబడిరి. సొడ్డు దుర్గమునందు ఇటీవల పట్టుకొనబడిన ఇటాలియను పటాలాలలో 25 వ సైనిక దళనాయకుడగు జనరలు లిబరట్టి, 101 వ పటాలనాయకుడగు జెనరలు బక్కారిగార్లు గూడగలరు. ఆ ప్రాంతమున నింతవరకును పోరాటము సాగించుచున్న 4 ఇటాలియను సైనికదళములు పూర్తిగ రూపు మాపబడెను. డెబ్రామార్కోస్‌నుండి తప్పించుకొనిపోయిన ఇటాలియను సైన్యం 24 తేదీన ఆడిస్ అబాబా పర్వతాలలో మూడు రోజులు భయంకర పోరాటము జరిగిన పిదప లొంగి పోయినది. ఇందు 5,000 దేశీయ సైనికులు, 3,000 బందాలు, 57 ఇటాలియను సైనికులు గలరు. 170 మరతుపాకులు, 7 ఫిరంగులుగూడ పట్టుబడెను.

24, 25 వ తేదీలలో శత్రువిమానాలు సూయజు రేవు దుర్గముపై దాడివచ్చి చాల బాంబులు వేసెను, కాని నష్టం యెక్కువ గలుగలేదు.

## టర్కీ, ఈరాక్-ఈరాన్.

ఈరాక్ రంగమున, శత్రుల ప్రతిఘటన శిథిలమై పోవుచున్నది. బ్రిటిషు ప్రభుత్వమువారు, గత మాసమున బలవంతముగ వెడలగొట్టబడిన అబ్దుల్ ఇల్లాగారినే, మైనరు రాజునకు 'రీజెంటు'గ గుర్తించి బలపరుచుటకు నిశ్చయించిరి. గెరాల్డు డి గెరీగారిని, అబ్దుల్ ఇల్లాగారి ప్రభుత్వమునకు బ్రిటిషు ప్రతినిధిగ నియమించిరి. అబ్దుల్ ఇల్లాగారు 23 వ తేదిన మాజీ ప్రధాని నౌరీపాషాగారితో ఈరాకునకు తిరిగి వచ్చి, క్రొత్త ప్రభుత్వమును నెలకొల్పుటకు ప్రయత్నములు సాగించెను.

బ్రిటిషు సైన్యములు మే 19 వ తేదిన, యూఫ్రటీస్ నదీ ప్రాంతమునగల ఫల్లూజా నగరమునేగాక, రూట్బా పట్టణమునకు 25 మైళ్ళ తూర్పున నూనె గొట్టముల మార్గమునందున్న హెచ్ 2 వ సైనిక శిబిరమును గూడ ఆక్రమించి, అందలి సైనికులను ఖైదీలుగా పట్టుకొనెను. 23 వ తేదీన ఫల్లూజాను తిరిగి పట్టుకొనుటకు ఈరాకు సైన్యం ప్రయత్నించినదిగాని, వెనుకకు కొట్టివేయబడెను. బ్రిటిషు సైన్యం, ఈరాకు రాజధానియగు బాగ్దాదునకు 20 మైళ్ళ దూరములోకి సమీపించెను. జర్మను విమానములు వచ్చి హబ్బనియా ప్రాంతమున బ్రిటిషు సైనిక శిబిరముపై బాంబులు వేయుచు తొందర గల్గించుచుండెను. 24, 27 వ తేదిలలో మోసలు ప్రాంతమునందలి శత్రు సైన్య శిబిరములపై బ్రిటిషు విమానములు బాంబుల వర్షించెను.

తిరుగుబాటు ప్రభుత్వ నాయకుడగు రషీదు అలీగారు రాజధానియగు బాగ్దాదునుండి పారిపోయెను. తనకు, కుటుంబమునకు టర్కీని ప్రవేశించుటకు అనుమతి నొసగవలెనని దరఖాస్తు చేసినటుల దెలియుచున్నది. 26 వ తేదిన రషీదు అలీగారి కుటుంబము టర్కీ చేరెను. అతని యుద్ధాంగమంత్రియగు షాకద్ గారుగూడ సకుటుంబముగ 26 వ తేదిన టర్కీ చేరెను. మరి కొందరు మంత్రులు పర్షియా చేరినటుల వార్తలు వ్యాపించెను. రషీదు అలీ మోసలు ప్రాంతములందుండి బ్రిటిషు సైన్యముల నిరోధించుచు జర్మను సహాయము వచ్చువరకు వేచియుండదలచినట్లు అనుకొనుచున్నారు. బ్రిటిషు విమానదళము 26 వ తేదిన, మోసలు, చారుబీ, టమ్మీ మొదలగు ప్రాంతములో శత్రు విమానాశ్రయాలపై బాంబులు వేసి నిర్మూల మొనర్చెను. క్రొత్తగా సహాయము వచ్చిన కొన్ని జర్మను విమానములు దప్ప—రషీదు అలీ సైన్యమునకున్న విమాన దళమంతయు శిథిలపరుపబడెను. తిరుగబాటు దారుల సైనికులు ప్రతి దినము, విడిచి పారిపోవుచున్నారనియు, తిరుగబాటుదారుల ప్రతిఘటన తగ్గిపోవుచున్నదనియు, యెక్కువ రోజులు సాగదనియు తలచుచున్నారు

దేశరక్షణ సన్నాహాల కొరకుగాను 830 లక్షల పౌనులు మంజూరు చేయవలసినదని టర్కీ ప్రభుత్వం శాసన సభను గోరునటుల ప్రకటింపబడెను. గ్రీసుపై జర్మనులు దాడి ప్రారంభించినపుడు, టర్కీ అధికారులు, టర్కీకిని బల్గేరియా గ్రీసులకును సరిహద్దునందుగల రైల్వే వంతెనలను పడగొట్టుకొనిరి. ఈ వంతెనలను తిరిగి నిర్మించు విషయమున సంప్రదించుటకుగాను జర్మను-బల్గేరియను, టర్కీ ప్రతినిధులు ఉజుంకర్ప్రూవద్ద సమావేశమగుదురు.

## విషీ.

ఫ్రెంచి ప్రభుత్వము జర్మనీతో సహకారమొనర్చుటకు గావించుకొనిన నిర్ణయము పరాసు ప్రజలయందు అసంతృప్తిని కల్గించుటయేగాక, ఆంగ్ల-అమెరికా రాష్ట్రములనుండి

గూడ చాల హెచ్చరికలకు కారణమయ్యెను బ్రిటిషు విదేశాంగమంత్రియగు ఈడెన్‌గారు 22 వ తేదిన పార్లమెంటునందు ప్రసంగించుచు, ఫ్రెంచి ప్రభుత్వము జర్మనీతో సహకారమొనర్చి, సత్వర బ్రిటిషు విజయమునకు అడ్డుదగులు నెడల, ఆక్రమిత ప్రాంసునువలెనే అనాక్రమిత ప్రాంసును గూడ శత్రుదేశముగ పరిగణించి విమాన బాదులకు గురిచేయ వలసియుండునని హెచ్చరించెను. బొలివియాయందలి ఫరాను ప్రభుత్వ రాయబారికి, తన ప్రభుత్వపు నూతన విధానము ఇష్టములేక, తన పదవికి రాజీనామా నొసగెను. స్వతంత్ర ఫ్రెంచి సైన్యముల నాయకుడగు డిగాలీగారు, జర్మనీతో సహకార మొనర్చుటకు ఫ్రెంచి ప్రభుత్వము గావించు కొను ఒడంబడిక లెవ్వియు చెల్లనేరవని ప్రకటించెను.

ఫ్రెంచి ప్రభుత్వ ఉపప్రధానియగు అడ్మిరలి డార్లన్‌గారు 23 వ తేదిన ఫరాను ప్రజలకు రేడియో సందేశమొసగుచు హిట్లరు ఫరాను నౌకాదళమునుగాని కాలనీలనుగాని యే మాత్రమును గోరలేదనియు, ప్రాంసునెడల ఉదారముగ నుండెననియు, జర్మనీతో సహకారమొనర్చుట ఒక్కటియే ప్రాన్సునకుగల మార్గమనియు, గత్యంతరము లేదనియు ప్రకటించెను. సంయుక్త రాష్ట్రములలో ఫరాను రాయబారియగు హెన్రీ హేగారు—ప్రాన్సు జర్మనీతో గావించు సహకారము పశ్చిమార్ధగోళ ప్రాంతములకు వర్తింపదనియు, కాలనీలను, నౌకలను జర్మనీ కొసగమనియు ప్రాతమూలముగ అభయ మొసగెను.

జర్మనులతో సహకారమొనర్చుట ఇష్టములేక, సిరియాయందలి ఫరాను సేనానాయకులలో అత్యంత ప్రతిభావంతుడగు కర్నలు కాలెటుగారు సిరియాను వదలి పాలస్థానమును ప్రవేశించి, స్వతంత్ర ఫరాను సైన్యములలో చేరిననుల 23 వ తేదిన ధృవపరుపబడెను. అతనివెంట ఇంకను పదికొందరు సైనికాధికారులు గూడ వచ్చిరి. ఫరాను ప్రభుత్వంవారు కాల్లెటుగారి ఫరాను పౌరహక్కుల రద్దుచేసిరి. తమకు కావలసినదానికంటె యెక్కువగనున్న ఆయుధ సామగ్రిని—సిరియా ఫరాను అధికారులు ఈరాకు తిరుగుబాటుదారగు రషీదాలికి సప్లయిచేయుచున్నట్లు తలంపవచ్చునని మేజరు అట్లీగారు పార్లమెంటులో దెలిపిరి. పాలస్థానమునుండి సిరియాపైకి దాడి ప్రారంభమగునను భయముచే, సిరియాలోని ఫరాను సైన్యమును లెబనన్ రాష్ట్రములోనికి ముందుకుపంపిరి. సిరియాయందలి బ్రిటిషు ఈజిప్టు పౌరులు స్వదేశములకు తరలిపోవుచున్నారు. 24 వ తేదిన సిరియా—పాలస్థాన సరిహద్దులు మూసివేయబడినట్లు ప్రకటింపబడెను. బ్రిటిషువారి పాలస్థానమందలి ఫరాను రాయబార కార్యాలయము లన్నిటిని మూసివేయుటకు ఉత్తరువుగావింపబడెను.

జర్మను అధికారులు విడుదలచేసిన ఫరాను యుద్ధ ఖైదీలలో 573 అధికారులు 100 మంది పెద్ద సైనికోద్యోగులు రైలులో మార్సెయిల్సునకు వచ్చిచేరిరి. మాజీ ఫరాను ఉపప్రధానియగు లెవెలుగారు 26 వ తేదిన పారిస్‌నందుపన్యసించుచు తాను హిట్లరుతో 10 గంటలసేపు సంభాషించితిననియు, ప్రాన్సు తిరిగి నిలబడవలెనినయెడల జర్మనీతో సహకారమొనర్చితీరవలెననియు, దీనికి అమెరికా ప్రజలు ఆశ్చర్యపడరాదనియు ప్రకటించిరి.

## అమెరికా సంయుక్త రాష్ట్రములు.

అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారిదివరకు తటస్థశాసనమును గావించుకొనియుండుట గొప్ప పొరపాటని, నౌకా శాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు మే 22 వ తేదిన ప్రకటించుచు, సప్త సముద్రములలో స్వేప్రాంతమునైనను, యే యుద్ధ ప్రాంతమునైననుగూడ ప్రవేశించు స్వాతంత్ర్యమును అమెరికా నౌకలకు నిలిపియుంచుకొనవలసినదని పలికిరి. సెనేటు నౌకా వ్యవహారోప సంఘాధ్యక్షుడగు సెనెటరు వాల్షుగారుపన్యసించుచు తమకు వచ్చుచున్న జాబుల జూడగా, ప్రజలలో చాలమంది - సంయుక్త రాష్ట్రములు వెంటనే యుద్ధమున దిగవలెనని అభిప్రాయపడుచున్నటుల న్నదని వెల్లడించిరి. ప్రస్తుతం తమ రేవులలో నున్న సుమారు 80 విదేశీయ నౌకలను, స్వాధీనపరచుకొని ఉపయోగించుకొనుటకు ప్రభుత్వమువారి కధికారమొసగు నౌకా చట్టమును సంయుక్త రాష్ట్ర శాసనసభల సంయుక్త సంఘమువారు ఆమోదించిరి యునైటెడు స్టేట్సు ప్రభుత్వము బ్రిటనుకు ఆయుధ సామగ్రిని పంపు నౌకలతో బాటు యుద్ధ నౌకలతైనాతీ యొసగునెడల అది జర్మనీపై యుద్ధ చర్యగ పరిగణింపబడుననియు సముద్రములలో అమెరికను నౌకలు గస్తీ తిరుగుచు జర్మను నౌకల స్థితిగతుల గురించి బ్రిటిషువారికి దెలుపుట, శత్రు చేష్టగ పరిగణింపబడుననియు, జర్మను నౌకా దళాధికారియగు అడ్మిరలు రీడరు గారు బెదరించిరి. సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారు 18 నెలలలోగా 13,000 బాంబరు విమానములను నౌకాదళ శాఖకు 21,000 పోరాట విమానములను నిర్మించుటకేర్పాటు లొనర్చుచున్నారు.

రూజ్వెల్టు అధ్యక్షుడు 27 వ తేదిన రేడియోలో అమెరికను ప్రజలకు ఉపన్యసించుచు, యునైటెడు స్టేట్సు రక్షణకు చాల ఉపద్రవకరమగు పరిస్థితులు ఏర్పడెనని దెలుపుచు "నేషనల ఎమర్జెన్సీ"ని ప్రకటించెను. ఈ ప్రకటన క్రింద అధ్యక్షుడు దేశరక్షణకుగాను యట్టి చర్యలనైన గావింపవచ్చును. యుద్ధం మాత్రము ప్రకటించుటకు వీలు లేదు. బ్రిటనుకు ఇతర ప్రజా ప్రాతినిధ్య దేశములకు ఆయుధ సహాయమును పూర్తిగ అందజేసి తీరెదమని ప్రకటించెను. విమాన బలమును హెచ్చించుటకు 33,190 లక్షల డాలర్లను మంజూరు చేయవలసినదని రూజ్వెల్టు శాసనసభలను గోరెను.

గ్రీన్‌ల్యాండు సమీపమున బ్రిటిషు యుద్ధ నౌకలకును, జర్మను యుద్ధ నౌకలకును 24 వ తేదిన పెద్ద పోరాటము ప్రారంభమయ్యెను. "హుడ్" అను 42,000 టన్నుల బ్రిటిషు యుద్ధ నౌక మునిగిపోయెను. 'బిస్మార్కు' అను 35,000 టన్నుల పెద్ద జర్మనుయుద్ధ నౌక పారిపోయెను. కాని బ్రిటిషు విమానములు, యుద్ధ నౌకలు దానిని వెంటాడి 27 వ తేది మధ్యాహ్నం డెన్మార్కువద్ద సముద్రములో నిలుకరించెను. తీవ్రముగు పోరాటం జరిగిన పిదప "బిస్మార్కు" ముంచివేయబడెను.

## దూరప్రాచ్యము.

అమెరికా సంయుక్త రాష్ట్రములు బ్రిటనుతరఫున యుద్ధమున దిగునటులున్నదనియు, అటుల దిగుచో, జపానుగూడ అక్షరాజ్యాలతరఫున యుద్ధమున దిగవలసివచ్చుననియు, జపాను విదేశాంగ శాఖాధికారి 27 వ తేదిన ప్రకటించెను. అంతకుముందు 22 వ తేదిన మంత్రులును దేశరక్షణ శాఖల అధికారులును సమావేశమై అంతర్జాతీయ వ్యవహారముల చర్చించిరి. అందు గావింపబడిన నిర్ణయములను మట్సుఓకాగారును, సైనిక శాఖా మంత్రియగు టోజో సేనానియు జపాను చక్రవర్తికి నివేదించిరి. డచ్చి తూర్పు ఇండియాదీవుల అధికారులు, అచటి దేశీయ ప్రజలకుగూడ నిర్బంధ సైనికవృత్తిని అమలుజరుపుటకు గావించుకొనిన నిశ్చయము జపానునకసంతృప్తిగలిగించెను. ఇది డచ్చివారి తూర్పు ఇండియా వ్యవహారముగలేదనియు, ఆంగ్ల-అమెరికా దేశముల కొరకమైనను,

రెండవవైపున జపానునకును యేర్పడిన సమస్యగ పరిణమించినదనియు మాటలతో డచ్చి అధికారులు లొంగరనియు, కొకుమన్ సింబన్ అను జపానుపత్రిక వ్రాసెను.

చైనాయందు యుద్ధము ఈవారము చాల తీవ్రముగ నడచెను. చెకియాంగురాష్ట్రమున, చూకి అను పట్టణమును చైనీయులు తిరిగి ఆక్రమించుకొనిరి. 68 జపాను విమానములు చెంటూ సూయునింగు మొదలగు పట్టణములపై దాడి సాగించి చాల బాంబుల వర్షించి వెళ్లినవి. ఇంతవరకును, ఉత్తరరాష్ట్రములలో యుద్ధమున పాల్గొనకుండ నిలచియున్న కమ్యూనిస్టు సైన్యము ఇక, చాంగ్ కై షేకుగారి సైన్యములతో కలసి పోరాటము సాగించునని—కమ్యూనిస్టు నాయకుడు చోయెన్‌లైగారు ప్రకటించిరి.

## గ్రీసు-ఇటలీ.

ఇటలీ చక్రవర్తి వారము రోజుల క్రింద టిరనా పట్నమున కరిగెననియు, అచట పెద్ద యూరేగింపుగా విమానాశ్రయమునకు జనుచుండ ఒక గ్రీకువ్యక్తి, చక్రవర్తిపై చాల తుపాకి గుండ్లు కురిపించెననియు, ఆతనిపుడు నిర్బంధమునుండెననియు 24 వ తేదీన ఇటాలియను అధికారులు ప్రకటించిరి తరువాత నీ నేరస్థుడు ఉరితీయబడెను.

## నౌకలు.

ప్రస్తుతము దక్షిణ అమెరికా రాష్ట్రముల రేవులలో వూరికేవున్న విదేశీయనౌకలలో కొన్నిటిని తమకు విక్రయింపవలసినదని బ్రిటిషు ప్రభుత్వమువారా రాష్ట్రియప్రభుత్వములతో రాయబారములు జరుపుచున్నారు. చాలమంది అమెరికన్ రెడ్‌క్రాస్ సంఘ సభ్యులు ప్రయాణమొనర్చుచున్న జాంజాం అను ఈజిప్టు నౌక జర్మనులచే ముంచివేయబడినదనియు అందలి ప్రయాణికులలో చాలభాగముమాత్రం జర్మను నౌకలచే కాపాడబడిరనియు ఇపుడు తెలుపబడెను. 23 వ తేదీన బ్రిటిషువారు, అట్లాంటికు సముద్రంలో కరీనువారి నూనె నౌక నొకదానిని పట్టుకొనిరి. 6 కోట్ల పౌనుల ఖర్చుతో 123 చిన్నవర్తక నౌకలను నిర్మించుటకు యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వము క్రొత్తగా ఇపుడు ఉత్తరువు చేసెను.

## తటస్థ దేశాలు (రష్యా, స్పెయిన్, ఐర్లండు).

రష్యా ప్రజలలో యుద్ధ విముఖతను గల్గించు ప్రచారమును ఖండించుచు ‘కమ్సుమోల్ ప్రవాద’ అను పత్రిక వ్రాసెను. ప్రస్తుత మహాసంగ్రామానంతరము ప్రపంచములోకెల్ల రష్యా సైన్యమె బలవత్తరమైనదిగ నుండునట్లు లొనర్పవలెనని ఈ పత్రిక సూచించెను.

స్పెయినులో ఫలాంగ్ పక్షపు రాజకీయ శాఖాధ్యక్షుడగు సెనరు సూనరుగారి అధికారముల నిర్వచించుచు స్పెయిను ప్రభుత్వాధ్యక్షుడగు ఫ్రాంకో సేనాని 22 వ తేదీ నొక ప్రకటనను గావించెను. ఆ ప్రకటనయందు, సూనరుగారికి ఇంచుమించు సర్వాధికారములు నొసగబడెను. దీనివలన సూనరుగారియొక్కయు, ఫలాంగ్ పక్షముయొక్కయు స్థితి ఇదివరకుకంటె చాల బలపడెను.

పోర్చుగలు ప్రభుత్వము, అట్లాంటికు సముద్రమునందలి అజోర్సుదీవుల రక్షణార్థము క్రొత్తగా మరికొన్ని సైన్యములు పంపెను.

ఉత్తర ఐర్లండు ప్రధానియగు ఆండ్రూస్‌గారు, తమ దేశమున నిర్బంధ సైనికవృత్తిని ప్రవేశపెట్టు విషయము నాలోచించుటకుగాను 23 వ తేదీన చర్చిలు ప్రధాని పిలుపుపై లండను కరిగెను. దక్షిణ ఐర్లండు ప్రభుత్వనాయకుడగు డివెలిరాగారును, ఉత్తర ఐర్లండులోని ఐరిషు నాయకులును గూడ, ఈ సూచనను ఖండించిరి. 26 వ తేదిన దక్షిణ ఐర్లండుయొక్క పార్లమెంటు సమావేశమై చర్చించిరి. ఉత్తర ఐర్లండుగూడ, ఐర్లండులోని దేననియు అచటి ఐరిషు ప్రజలకు బ్రిటిషు ప్రభుత్వమువారు నిర్బంధ సైనిక సేవావిధానమును అమలు జరుపునెడల బ్రిటనుకు ఐర్లండునకు ప్రస్తుతమున్న అన్యోన్యభావము చెడి పూర్వపు కలహములు తిరిగి యేర్పడునని యు అన్నిపక్షముల నాయకులును, యేకగ్రీవముగ హెచ్చరించిరి.

ఉత్తర ఐర్లండులో నిర్బంధ సైనికసేవను అమలు జరుపు ఉద్దేశమును బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రస్తుతం వదలుకొనిరని చర్చిలు ప్రధాని 27 వ తేదీన పార్లమెంటులో ప్రకటించెను.

# అమెరికా అధ్యక్షుని మహత్తర ప్రకటన.

## రూజువెల్టుగారు అపరిమిత జాతీయ ఆపద్ధర్మములు జరుపుట.

అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు మంగళవారం రాత్రి అమెరికా ప్రజలనుద్దేశించియు ప్రపంచంలో అన్ని రాజ్యాల ప్రజలను ఉద్దేశించియు రేడియోద్వారా ఇట్లు ప్రకటించిరి :—

“నాజీలు ప్రపంచంలోని ప్రజాస్వామ్యరాజ్యాలన్నింటిని కూలద్రోయవలెనని యత్నించుచున్నారు. మనసాటి ప్రజాస్వామ్యములన్నీ ప్రపంచంలో క్షేమంగా ఉండడంవల్లనే మన అమెరికాలోని ప్రజాస్వామ్య ప్రభుత్వంగూడ క్షేమంగా ఉండగలదు. హిట్లరు యూరోపునంతా వశపరచుకొనెను. ఇంతకు మించి విజృంభించకుండా మనము హిట్లరును అరికట్టనియెడల అమెరికా ఖండంమీదకూడా నాజీలు దండెత్తగలరు. అమెరికాకు సమీపంలో జర్మన్లు స్థావరమును సంపాదించకపూర్వమే, అమెరికాయొక్క సైనికబలము పూర్తిగా ఆయత్తము చేయవలసియున్నది. ఇప్పుడు అమెరికాలో అపరిమితమైన జాతీయాపద్ధర్మములను ప్రయోగించుచున్నాను. కనుక అమెరికాయొక్క నౌకాబలమును, విమానదళమును, మెట్టసైన్యమును యుద్ధావసరమునకు తగినట్లుగా సన్నాహము చేయవలసియున్నది.”

తరువాత అధ్యక్షుడు యుద్ధం ప్రారంభం అయినప్పటినుండి ఇంగ్లాండునకు ఎట్లు సాయము చేయుచున్నదియు, ఆయుధములు మందుగుండు స్టీమర్ల ఉత్పత్తి ఎట్లు ఎక్కువచేయుచున్నదియు, వివరముగా తెలిపిరి. హిట్లరు గెలుస్తే ప్రపంచం అంతను తన ఇష్టమైన రీతిగా విభాగాలు చేస్తాడు. అనేక రాజ్యాలమీద తన స్వస్తిక్ పతాకం ప్రతిష్ఠించి తన చేతికీలుబొమ్మలవలెనుండు ప్రభుత్వాలను ఆయా రాజ్యాలలో ప్రతిష్ఠిస్తాడు. అట్లాంటికు మహాసముద్రంలోను పసిఫిక్ మహాసముద్రంలోను తాను సర్వాధికారం వహిస్తాడు. మన అమెరికా సంయుక్త రాష్ట్రములను కెనడా రాజ్యమును కూడా కబళించాలని జర్మనీ ఎత్తువేయుచున్నది. నాజీలు నాస్తికులు. మన మత స్వాతంత్ర్యమునుకూడా పాడుచేస్తారు. అటువంటి నాజీ తత్వమునకు మనం వశంకాకుండా చూచుకోవాలి. అని రూజువెల్టుగారు తెల్పిరి.

### నౌకా మార్గాల స్వేచ్ఛ : బ్రిటనుకి అన్నివిధాల సహాయం.

సముద్ర మార్గాల స్వేచ్ఛనుబట్టియే అమెరికా ఖండంలోని రాజ్యాలన్నియు స్వేచ్ఛగా జీవింపగలుగుచున్నవి. గత ఐరోపా యుద్ధంలో వర్తక నావలకు వెంట కాపలాగ చిన్న క్రూయిజర్లను, ఫిరంగినావలను, యుద్ధనావలను తైయినాతిగా పంపియుంటిమి. ఇపుడును వర్తక నౌకలకు యుద్ధనౌకల సహాయం యిదివరకుకన్న ఎక్కువగా కావలసియున్నది. వెనుకటికన్న యిప్పుడు ఎక్కువ బలమైన జలాంతర్గాములు ఉపయోగింపబడుచున్నవి. 800 మైళ్ళ దూరమునుంచిగూడ శత్రు విమానాలువచ్చి నడి సముద్రంలోఉండే నావలను ముంచగలుగుచున్నవి. విస్తారమహాసముద్రమంతటను ఎక్కడ చూస్తే అక్కడ వర్తకనావలు అత్యధికంగా అతిఘోరంగా నాజీల దాడిచే ముంచివేయబడుచున్నవి. ఎక్కువగా అమెరికా కోస్తాప్రాంత సముద్రభాగములలోనే ముంచబడుచున్నవి. నిజమైనసంగతి మనస్సుకు కష్టమైనా చెప్పక తప్పదు. ప్రస్తుతం బ్రిటిషువారు ఒక పరిమితమైన గడువులో ఎన్ని నావలను క్రొత్తగా నిర్మింపగలరో అంతకు మూడింతలు ఆగడువులోనే నాజీలు ముంచివేయుచున్నారు. ఇంగ్లాండు అమెరికా కలసి ఏకకాలమందు నిర్మింపగల నావలకు రెండింతల నావలను నాజీలు ముంచివేయుచున్నారు. ఈ విషయం బ్రిటిషువారి అనుమతితోనే తెలియజేయుచున్నాను. ఈ ముప్పును అరికట్టుటకు మహత్తరమైన నౌకా నిర్మాణ కార్యక్రమమును హెచ్చింపవలెను. సముద్రముపైన కలుగు నష్టము తగ్గింపవలెను. అట్లాంటిక్ సముద్రమును, ఏదీవులనూ జర్మనులు ఆక్రమించకుండా మనము కాచుకోవలయును. డిక్టేటర్లు యీ ఖండముపై దాడి సలుపుటకు వచ్చిచేరువరకును వేచియుండుట ఆత్మనాశనకరము. కావున అట్లాంటిక్ సముద్రమంతకు మన కాపలాను విస్తరింపచేసియున్నాము. పశ్చిమార్ధగోళముపై అధికారము సంపాదించుటకును, సముద్రాధిపత్యం సంపాదించుటకును హిట్లరుచేయు ప్రతిప్రయత్నమును తీవ్రముగా ప్రతిఘటింతుము.

సైనిక నౌకావసరములను దృష్టిలోనుంచుకొని బ్రిటనుకును బ్రిటనుతోకలసి, దౌర్జన్యమునకు మరోపేరైన హిట్లరిజమును ప్రతిఘటించుచున్న ఇతర దేశాలవారికిని సంపూర్ణముగా సహాయముచేతుము. వెంటనే కావలసిన సప్లయిలను బ్రిటనుకు అందజేయుటకు మన కాపలా (పెట్రోలు) నావలు తోడుపడుచున్నవి. వస్తు సామగ్రి అందజేయడానికి మరేచర్యలైనా అవసరం అయితే అవికూడా చేస్తాము. అవసరమైన చర్యలను అమలుపరుచుటకు మన ప్రవీణులు ఉపాయములను కనిపెట్టుచున్నారు. బ్రిటనుకు సామగ్రిని అందజేయడం అత్యవసరం, బ్రిటనుకు సామగ్రిని అందజేయగలము, తప్పక అందజేయవలసియున్నది, తప్పక అందజేతుము, అని రూజువెల్టుగారు దృఢముగా పలికి అమెరికా రాష్ట్రములన్నియు ఐకమత్యముగా ఉన్నవనియు, కొందరి పిరికిమాటలను నమ్మవద్దనియు, ప్రజలందరు తమ కర్తవ్యమును నెరవేర్చవలెననియు హెచ్చరించిరి. సముద్ర మార్గాల స్వేచ్ఛ నిరోధింపబడరాదనియు పశ్చిమార్ధగోళము యొక్క స్వాతంత్ర్యము కాపాడుటయందు 21 అమెరికన్ స్వతంత్ర రాష్ట్రములును కెనడాయును ఐకమత్యముతో దృఢ సంకల్పము కలిగియున్నవనియు, అమెరికా ప్రజలపక్షమున అధ్యక్షుడనైన నేను మరొకసారి ప్రతిజ్ఞాపూర్వకంగ చెప్పుచున్నాను. ప్రజల స్వాతంత్ర్యమును నిలుపగోరే అన్ని దేశాలకు కావలసిన సామగ్రి అంతా అందజేస్తామని మేమిదివరకే వాగ్దానం చేశాము. అమెరికా దేశానికి ఎక్కడ ఎప్పుడు ఏది ఉపద్రవమో నిర్ణయించే అధికారం మాకేగలదు. అవసరమగు ముఖ్య ప్రదేశములందు సైన్యాలను ఉంచుచున్నాము. స్వాతంత్ర్యమూ, సహనము, దైవభక్తి ఈ మూడింటికి శాశ్వతమగు నివాసము మా రాజ్యాంగ విధానమని మాకు పూర్తిగా విశ్వాసముగలదు. దానిని కాపాడుటకు సర్వ ప్రయత్నములను చేయుదుము.”

---

# క్రీటు యుద్ధము

## మధ్యధరా సముద్రంలో అతిప్రధానమగు కేంద్రము.

గ్రీకుల పెద్ద ద్వీపమగు క్రీటులో యిపుడు ఘోరయుద్ధం జరుగుచున్నది. బ్రిటిషు నౌకాదళం జర్మను సేనలను స్టీమరులపైనుండి రాకుండా ఆటంకపరుస్తున్నందున, జర్మను సేనలు విమానాలపైనుండి క్రీటులో దిగి ఆక్రమింపచూస్తున్నాయి. బ్రిటిషు సామ్రాజ్య సేనలును, గ్రీకు సేనలును ద్వీపాన్ని రక్షిస్తున్నాయి. న్యూజిలండు సేనానాయకుడగు మేజరు-జనరలు ఫ్రేబర్గు వారి నాయకుడు. చావుకి తెగించి ద్వీపాన్ని రక్షిస్తామని చర్చిలుకి బాస చేశారు.

అతి ప్రాచీన నాగరికతకు పుట్టినిల్లయిన యీ ద్వీపం యొక్క ప్రాముఖ్యతను జర్మనులును, మిత్రమండలివారును బాగా గుర్తించారు. మధ్యధరా సముద్రంలో సిసిలీ, సార్డినియా, సైప్రెసు ద్వీపాల తరువాత పెద్ద ద్వీపం క్రీటే. దీని తూర్పుకొననున్న కేపు సిడెరో నగరం ఆశియా మైనరు సముద్రతీరానికి 110 మైళ్లదూరంలో ఉంది. మధ్యగ కార్పెతోసు, రోడ్సు ద్వీపాలున్నాయి. క్రీటు పశ్చిమకొననున్న కేపు గ్రాబుసా నగరానికి మొరియా దేశపు తీరం 60 మైళ్ళే. ఈజియను సముద్రంనుండి శత్రుసేనలు బయటకు పోకుండా ఆటంకపరచుటకును అచటికి డొడకనీసు దీవులకును మధ్య సైంధవునడ్డుగా క్రీటుయుండును. డొడకనీసు దీవులలోనున్న ఫాసిస్టు సేనలు నిరుపయోగములగును. సైప్రెసు దీవిని కాపాడుటకు యిది చాల ఉపయోగపడు స్థలము. బ్రిటిషువారి నౌకాదళ శిబిరమగు అలగ్జాండ్రియా రేవునకు 300 మైళ్ళదూరంలో ఉంది. లండను టైమ్సు పత్రిక చెప్పినట్లు ఈజిప్టు రక్షణకును, బ్రిటిషు నౌకాదళాధిక్యత కాపాడుకొనుటకును క్రీటు ఎంతగానో అవసరమనుటకు సందియము లేదు. కాని శత్రువు దీనిని వశపరచుకొన్నచో ఈజిప్టుపై దాడిచేయుటకును, గెలిచిన రాజ్యం కాపాడుకొనుటకును అతనికి మరీ బాగా ఉపయోగపడును.

### క్రీటు స్వరూపం.

క్రీటు ద్వీపం విస్తీర్ణం 3,[illegible]20 చదరపు మైళ్లు. నిడుపైన దీవి. తూర్పునుండి పడమరకు 160 మైళ్ల వెడల్పు ; అతి సన్నగ నున్నచోట 7½ మైళ్లు; ఎక్కువ వెడల్పైనచోట 35 మైళ్లు. ఉత్తరతీరం వంకలుగావుండి అనేక నౌకాశ్రయాలకు అనుకూలంగా వుండును. దక్షిణ తీరం గీతగీచి నట్లుండును. పడమర కొసను కొండలతోనిండి రెండు సూదైన భూభాగాలు

సముద్రంలోనికి చొచ్చుకొనివచ్చును. బుసా, స్పాడా అని ఆ రెండు అగ్రములకు పేరు. వాటిమధ్య కిసామాను బే అను సముద్రం గలదు. వాటికి పడమరగ కానియా బే అను సముద్రం, దానికి తూర్పుగ అక్రొటిరీ అను ద్వీపకల్పం గలవు. ఈ ద్వీపకల్పం చాటున సుడా అను రక్ష చదరపు మైళ్ల హార్బరు (నౌకాశ్రయం) ఉంది. ఇదియే యీ దీవి యంతకు పెద్ద హార్బరు. నౌకలకు మంచి రక్షణ యిస్తుంది. తరువాత తూర్పునకు వరుసగ కాండియా, మాలియా, మిరాబెల్లో, సిటియా యను అఖాతములు గలవు. దక్షిణ తీరమునందు లితినాను అగ్రమొక్కటే ముఖ్యమైనది. దాని ప్రక్కన మెసారా బే గలదు. సుడా హార్బరు ఎదురుగ సుడాయను చిన్న ద్వీపము, పడమర బుసాఅగ్రము చెంత గ్రాబుసా అను చిన్న దీవియు గలవు; దేశంలో కొండలు ఎక్కువ. కొన్ని 7,000 అడుగుల ఎత్తుగానుండును. వాటి ప్రక్కన అనేక గుహలుకలవు. వాటిలోనికి సూర్యునికాంతి ఎన్నడు పోదు. పెద్ద సేనలే ఎన్నో రోజులు వాటిలో దాగొనవచ్చును. కొన్నిచోట్ల ఎండకాలంలోగూడ మంచి పచ్చిక దొరకు బయళ్లు గలవు. ముఖ్య నగరాలన్ని ఉత్తర తీరాన్నే ఉన్నాయి. వాటి ప్రక్కన చిన్నచిన్న హార్బరులు గలవు. కాండియా అన్నది పూర్వం ముఖ్యపట్నం. దాన్నే హిరాక్లియను అనికూడా అంటారు. కానియా నగరం 1840 నుండి ముఖ్యపట్నంగా ఉంది. రెటిమో, హైరా పెట్ర, సిటియా, కిసామాను, సెలినో, స్ఫాకియా అన్నవి తక్కినవి.

## ప్రాచీన చరిత్ర.

క్రీస్తు పుట్టుక మునుపు 3,500 సంవత్సరములనుండియు యీ దీవియందు ప్రాచీన నాగరికత వెలసియున్నది. తరతరాలుగా మారుచున్న వివిధ యుగములందలి నాగరికతలు యీ దీవి నంటుచునే యున్నవి. యూరోపు, ఆశియా, ఆఫ్రికా దేశాలకు మధ్యగ ఉండుటచే యీ దీవియందే విభిన్న నాగరికత విజ్ఞానములన్ని కలసియుండి, పెక్కుయుద్ధాలకు రంగమవుతూ వచ్చింది. క్రీటు దేశీయులు ధైర్యసాహసాలకు ప్రసిద్ధి చెందినవారయి విదేశీయాధికారులపై తిరుగబడి తరిమివేయుచుండిరి. రోమను సామ్రాజ్యం ప్రబలియున్నపుడు క్రీటు అతికష్టంపై వశపరచుకొనబడెను. తరువాత వరుసగ సారసేను, వెనీషి యను జాతులవారు వశపరచుకొనిరి. తమ స్వాతంత్ర్యమును కాపాడుటకు టర్కీ తోడ్పడునని ఎంచి కొందరు క్రీటనులు తురుష్కులుగ మారేరు కూడాను. కాండియా ముఖ్యపట్నం ముట్టడి 20 సం॥లు జరిగింది. గత శతాబ్దం అంతా దేశంలో అరాచకమే. ఈ 20 వ శతాబ్ద ప్రారంభంలో క్రీటనులు తమంత తాము గ్రీసు పరిపాలనక్రింద ఉండుట కంగీకరించి, గ్రీకు రాజు పేరట పరిపాలించుటకు ఒక పరిపాలక వర్గమును నియమించుకొనిరి. 19 2 వ సం॥ అక్టోబరు 14 వ తేదిన గ్రీకు ప్రధాని వెనిజెలాసు క్రీటుని గ్రీసు రాజ్యంలో చేర్చుకొనుట కంగీకరించెను: 1913 లండను ఒడంబడికలో 4 వ నిబంధన ప్రకారం జాతిభాషాసాంప్రదాయం ఐక్యతగల క్రీటు గ్రీసు దేశాలు ఒకే ప్రభుత్వంక్రింద ఉండాలని నిర్ణయించబడెను. అప్పటినుండి క్రీటు గ్రీసులో [illegible]గం అయింది.

గత నెలలో జర్మను సేనలు, విమానాలు గ్రీసు దేశాన్ని ఆక్రమించినపుడు బ్రిటిషు సామ్రాజ్య సేనలును గ్రీకు సేనలును క్రీటులోనికి మరలివచ్చి అక్కడనుండి జర్మనుల నెదిరించాలని నిశ్చయించినవి. గత యుద్ధంలో గాలిపొలి యుద్ధరంగమున ప్రఖ్యాతిగాంచిన మేజరు జనరలు ఫ్రేబర్గు గారు యీ మిత్రమండలి సేనలకు నాయకుడుగ ఉన్నాడు.

## జర్మను దాడి.

మే 19 వ తేది సోమవారం జర్మనులు విమానాలపై సేనలను దించి ఆక్రమింప ప్రయత్నించుటతో క్రీటు యుద్ధం తీవ్రంగా ప్రారంభమయినది. తొలిరోజునే ఖాళీచేయబడిన బ్రిటిషు విమానాశ్రయమువద్ద జర్మను సేనలు విమానాలపై నుండి సోమవారం రాత్రి దిగినవి. సూడాబే తీరాన ప్రారంభమయిన యుద్ధం కానియారోడ్డు వరకు వ్యాపించెను. మర ఫిరంగులతోగూడ మరికొన్ని సేనలు కాండియా రెటిమో నగరాల చేరువ ఆకాశంనుంచి దిగేయి. దిగిన తరువాతగూడ వాయువార్తా ఏర్పాటుద్వారా జర్మను సైనికులు తమ విమానదళంతో సంపర్కం ఉంచుకొనిరి. మంగళవారం మరికొన్ని సేనలు నౌకాదళ విమానాలలోని గ్లైడరుల (అంటే జారుడు విమానాల) ద్వారా దిగేరు. రెటిమో నగరంవద్ద వీరిలో కొందరు సముద్రతీరపు ఫిరంగులచే చంపబడిరి. గాని గాలిగుమ్మటాలలో దిగిన జర్మను సైనికులు అడవులలో దాగొని, తరువాత అంతా కలసి ఒక సైనికదళంగా ఏర్పడిరి. విమానాలద్వారా సైన్యాన్ని దింపే జర్మను యత్నం క్రీటులోనిదే అన్నింటికన్న పెద్దది. సుడాబే వశపరచుకొని బ్రిటిషు సేనలను దేశంలో భాగానికి తరిమివేయాలని జర్మనుల ఉద్దేశం. బ్రిటిషు సేన ఆ దీవికివచ్చి మూడు వారాలే అయింది కనుక, సైన్యాన్ని దిట్టంచేసుకొని దీవిరక్షణ కట్టుదిట్టములుచేయుటకు వ్యవధి చాలకుండెను. హెరాక్లియనునుండి, రెటిమో నుండి జర్మనులను బ్రిటిషువారు తరిమివేసి, రెటిమో నగరాన్ని విమానాశ్రయాన్ని యిపుడు వశపరచుకొన్నారు. మెలామి విమానాశ్రయము యింకను జర్మనుల వశమందుందికాని, తూర్పునుండి మిత్రమండలి ఫిరంగులకు బాగా గురి అవుతున్నది. హిట్లరు నిర్దాక్షిణ్యంగా సైనికులను సామానులను యుద్ధరంగంలో పడవేస్తున్నాడు. గాలి గుమ్మటాలు కూల్చబడుతూన్న కొద్ది క్రొత్తవి కూలిపోడానికి పంపుతూనే ఉన్నాడు. జర్మను నౌకలేవి క్రీటు తరం చేరలేవు. చిన్న చిన్న వర్తక నౌకలును, పడవలును సైన్యాలతోనిండి ఒక యుద్ధ నౌక కాపలాతో వస్తూవుంటే 21 వ తేదీ రాత్రి బ్రిటిషు నౌకాదళం ముంచివేసింది. వేలకొలది జర్మనులు సముద్రంలో తేలేరు.

బ్రిటిషువారి ఫైటరు విమానాలు దూరంనుండి తిరిగివచ్చి, సైన్యాలను తెచ్చు జర్మను విమానాలను పెక్కింటిని పడగొట్టినవి. కానియా, రెటిమో, హెరాక్లియను నగరాలపై గుంపులు గుంపులుగ జర్మను విమానాలు దిగువగవచ్చి బాంబులువేసి ప్రజలను భయపెట్టుచున్నవి. వారు వీరనక అందరిపై నిర్దాక్షిణ్యంగా బాంబులువేసి చంపడంలో రాటురుడాం నగరదృశ్యం జ్ఞాపకం వస్తుంది. కాని క్రీటు దేశీయులు లండనునగరవాసులవలెనే ధైర్యంగా నిశ్చలంగా ఉన్నారు. క్రీటులో ఉండిన గ్రీసురాజు, అతని ప్రభుత్వాన్ని మరీ గురిచూచి జర్మనీ విమానాలు బాంబులు వేయుచుండుటచే, యీ వారం అతడు, తమ సైన్యాల చర్యలకు అడ్డుకలుగకుండుటకై, ఈజిప్టునకు పోయెను. క్రీటు యుద్ధం యింకా తీవ్రతరంగా సాగే చిహ్నాలున్నాయి. "క్రీటుని కాపాడగలమనుకుంటాను" అని గ్రీసులో బ్రిటిషు సైనికాధికారి మేజరు జనరలు హేవుడుగారన్నారు. అతను విషయం తెలియకుండా అంటారా?

## రషీదాలి ద్రోహము : నైజాంగారు ఖండించుట.

ఇరాకు దేశంలోని సక్రమ పాలకులను తరిమివేసి బలవంతంగా రాజ్యాధికారం తీసుకొని జర్మనీతోచేరిన రషీ దాలి ద్రోహచర్యను ఖండిస్తు ఘనతవహించిన నైజాం ప్రభువుగారు యిట్లు ప్రకటించిరి :—

"ఇరాకులో యిటీవల బ్రిటిషు ప్రభుత్వంవారు తప్పనిసరిగా గైకొన్న చర్యలు మా సంస్థానంలోను ఇండియాలోను యితర దేశాలలోను మహమ్మదీయ ప్రజలకు కొన్ని అపోహలు కలిగించుటకు అవకాశముండుటచే, అవి తొలగించుటకు యీ ప్రకటన చేయుచున్నాను: ఇరాకు రాజ్యం సృష్టించుటలోనే ప్రధాన పాత్రవహించిన బ్రిటిషు ప్రభుత్వంవారికి, ఆదేశంతో సఖ్యతగనుండిన ఈజిప్టు, టర్కీలకు ఆదేశం ద్వారా మార్గాలను సురక్షితంగా ఉంచుకోడం తప్పితే యితర ఉద్దేశం ఏది లేదు. 1930 వ సంవత్సరపు ఒడంబడిక ప్రకారం యీ మార్గాల రక్షణ బాధ్యత వారిపైగలదు.

ప్రస్తుత ఇరాకు యుద్ధమునకు కారణం రషీ దాలి ద్రోహమే. ఈతడు దౌర్జన్యంగా అధికారం స్వీకరించి రీజెంటును తరిమివేసి, కొద్దిమంది అనుచరులతో కలసి, బ్రిటిషువారి ఒడంబడికను రద్దుచేసి, హబనియావద్ద బ్రిటిషు సేనలను చుట్టువేసినందున, పైన తెలిపినట్లుగ స్వరక్షణకొరకు, ఇండియా ఈజిప్టుల మార్గములను కాపాడుకొనుటకు, బ్రిటిషువారాతని సేనలను తరిమివేయవలసివచ్చెను. ఆడినమాట తప్పరాదని ఇస్లాము మతంయొక్క ప్రధాన విధి. ఈ విధిని తప్పిన రషీ దాలి చర్యను పూర్తిగ నిరశింపవలెనని ఇండియాలోని మహమ్మదీయుల నందరిని కోరుచున్నాను."

ఇరాకు పరిస్థితులగూర్చి ఇండియా ప్రభుత్వవారు యిట్లా ప్రకటించారు :—

రషీ దాలిగారికి ప్రారంభంలో అక్షరాజ్యాలతో సఖ్యత యున్నట్లు కొందరు నమ్మలేదు. కాని అతడు రాజప్రతినిధిని తరిమివేసి అధికారం స్వీకరించిన తరువాత ప్రతి చర్యయందును మధ్యప్రాచ్య దేశమునందలి ముస్లీము రాజ్యాలను, వారి మిత్రులగు బ్రిటిషువారిని అక్షరాజ్యాలకు ఒప్పగించే కుట్రలు పన్నుచున్నాడని రుజువయ్యెను. ఇరాకు రాజ్యాధికారం బడయుటకు, అక్షరాజ్యాల ప్రోత్సాహంమాత్రమే కాక వారి ఆర్థిక సహాయంకూడా జరిగెను. తరువాత శత్రువులు అరేబియాలో స్థావర మేర్పరచుకొనుటకు, టర్కీ ప్రక్క బెదురుగా చేరుటకు, ఇండియా ద్వారంవరకు వచ్చేటట్లు చేయుటకు అనుకూలంగా వుండేటట్లే ప్రతి కార్యం చేయుచుండిరి. భారత సైన్యాలు సత్వరంగా చర్య తీసుకొనుటచే యీ కుట్ర అంతా విఫలమయింది. ఇరాకు మీదుగా మార్గాలేర్పరచుకొనుటకు అదివరకున్న ఇంగ్లాండు-ఇరాకు ఒడంబడిక ప్రకారమే బ్రిటిషు సేనలు బస్రాలో దిగినప్పటికిన్ని, అవి దిగకుండా నిరోధించుటకే అదికిముందు రషీ దాలి తన సేనలను బస్రాకు పంపెను. కాని తన అక్షరాజ్యాల మిత్రులవద్దనుండి సహాయంరానిది బ్రిటిషు వారితో ఒడంబడికను భగ్నంచేస్తే తనకే భద్రతయుండదని దలంచి, బ్రిటిషు సేనలను వాటిత్రోవను వాటిని పోనిచ్చెను.

కాని ఇరాకు సేనలు బ్రిటిషు సేనలపై బస్రా జిల్లాలో బహిష్కారపద్ధతి అనుసరించినవి. తరువాత ఒడంబడికకు విరుద్ధంగా, బ్రిటిషు సేనలు ముందుకుపోగూడదని నిరోధించ యత్నించినవి. చమురు గనుల మార్గములను వశపరచుకొని, హబనియావద్దనున్న బ్రిటిషు సైన్యాలను ఇరాకు సేనలు చుట్టువేసి దాడి సాగించినవి. తనకు అక్షరాజ్యాల నుండి సహాయం వచ్చేవరకు బ్రిటిషు సేనలు యీ స్థితిలో అచలనంగా వుంటాయని రషీ దాలి తలంచియుండును. రాజకీయ రాయబారాలు విఫలంకాగానే, బలవంతగా రషీ దాలి నిరోధమును తొలగించుకొనుటకు బ్రిటను ప్రయత్నించెను. అతని అనుమతిపైనే బస్రాలో దిగిన సేనలు అతని నిరోధము నెదిరించవలసివచ్చెను. అపుడాతడు బెర్లిను రోము నగరాలకు ఆర్తనాదాలు తెలియజేసి, సహాయానికై మొరపెట్టుకొనెను. ఇరాకు ప్రజలు అతనికెట్టిసహాయంచేయలేదు. ఆయుధాలతోకూడిన సైన్యం తన చేతిక్రిందనున్నా లాభంలేకపోయింది. అతని మనుష్యులు కొందరు సిరియాకు పారిపోయిరి. బాగ్దాదులో ధరలు పెరిగిపోయి, దురాక్రమణకు గడంగిన రాషీ దాలి మురాకు బ్రతుకే కష్టంగావుండెను. ఇంతలో సిరియాద్వారా అక్షరాజ్యాల సహాయం కొంచెం వారికివచ్చింది.

అందుచే యింక సమస్య స్పష్టపడింది. రషీదాలి, తదితర మోసగాండ్ర ద్వారా అరబ్బీ దేశాలలోనికి జర్మనీ ఇటలీలకు ప్రవేశం ఒసంగుటా, లేక బ్రిటను ఇరాకుయొక్క సక్రమపాలకులకు తోడ్పడి ఆ దేశంస్వాతంత్రమును కాపాడి, చేరువ ముస్లిము రాజ్యాలపై జర్మనిదాడి తప్పించడమా అన్నదే సమస్య. రషీ దాలి ఇంగ్లాండుతో సఖ్యంగానుండి ఒడంబడిక షరతులు మన్నిస్తానని చెప్పిన మొదటి రోజులలోనే, యీ ఒడంబడిక అంతమొందించుటకు అక్షరాజ్యాల సహాయమును కోరుచుండెను. ఆ విషయం బ్రిటిషు ప్రభుత్వంవారికి తెలిసియున్నప్పటికి, తమ సేనలపై రషీ దాలి సైన్యాల ఒత్తిడి తొలగించినచో చేరువ ముస్లిము రాజ్యాలు కోరినట్లు రాజీ సంప్రదింపుల కంగీకరింతుమనిరి. కాని జర్మను సేనలు తనకు పూర్తిగ సహాయం చేయ లవను ఆశతో రషీదాలి యిట్టి న్యాయమగు పరిష్కారమున కంగీకరించలేదు. అందుకు శాస్తి అనుభవించుచున్నాడు. బాగ్దాదువిడచి మోసలు పోవలసివచ్చెను. కొద్ది కాలంలో దేశమే విడచిపోతాడు.

జర్మనీనుండి సహాయం తగ్గిపోయింది. క్రీటు సైప్రసులు జర్మనుల వశంకాంది రషీవలి తొందరపడి తిరుగుబాటు చేసేడు కనుక విఫలము కాక తప్పదని అంకారాలో జర్మనులంటున్నారు. బ్రిటిషు సేనలు బాగ్దాద్‌పై బడుచున్నవి. యూఫ్రిటిస్ నది దాటి బ్రిటిషు సేనలు బాగ్దాద్ చేరువకు వచ్చినవి. అవసరమయితే నదిగట్లు తెగగొట్టి దేశాన్ని నీటితో ముంచగలరు. మోసల్‌పై విమానదాడి జరుగుచున్నది. రాజప్రతినిధి ఎమీరు అబ్దుల్లా తిరిగి వచ్చి తిరుగుబాటుదారులను త్రోసివేయవలెనని ప్రజలను హెచ్చరిస్తున్నాడు. వారట్లు చేయుదురనుటకు ఎట్టి సందేహంలేదు.

## ఫ్రాంసు - జర్మనీ ఒడంబడిక : డిగాల్ గారి నిరోధము.

ఫ్రాంసుని జర్మనీ ఓడించిన తరువాత ఆ దేశంలో ప్రజలను ఎక్కువ హింసిస్తే జాలిదలచి అదివరకు ఫ్రాంసు మిత్రవర్గంలో నుండిన ఇంగ్లాండు జర్మనీపై యుద్ధం మానేస్తుందని జర్మనీ ఆలోచన. తాను స్నేహం విడచిన ఇంగ్లాండు గెలిచేవరకు ఫ్రాంసు యీ హింసంతా భరించాలి, లేదా కష్టం సహించలేక త్వరగ పూర్తిగ నాజీల ఒత్తడికి లొంగిపోయి జాతీయ పునరుద్ధరణ కార్యం ప్రారంభించాలి. ఫ్రాంసు అధికారులగు మార్షలు పెటేను, అడ్మిరలు డార్లనుగార్లు హిట్లరు

చూపిన "మోక్షమార్గము"నే అనుసరించారు. అందుచే ఫ్రాంసు యిపుడు జర్మనీకి బందీయైపోయింది. తన పరిశ్రమలు నిలిపివేసి ముడి పదార్థాలన్ని జర్మనీకి యిచ్చుకోవాలి. గౌరవ హీనమగు ఈ ఒడంబడిక వివరాలు యిపుడిపుడు బయలుపడుచున్నవి. అనాక్రమిత ఫ్రాంసుగుండాను, ఫ్రెంచివలస రాజ్యాలగుండాను జర్మను సేనలు పోవుటకు ఫ్రాంసు అంగీకరించిందని జర్మనీ చాటుచున్నది. అంతే తన్నిన కాలునే ఫ్రాంసు ముద్దుపెట్టుకుంటున్నది. ఫ్రెంచి నౌకాదళం జర్మనీకి లొంగదని, వలస రాజ్యాలేవి వారికివ్వంఅని, ఇంగ్లాండుతో యుద్ధానికి చేరాలని జర్మనీ కోరలేదని, డార్లానుగారు ప్రకటించారు. కాని అవి అంగీకరించుటకుకూడ ఎంతో ఆలశ్యముండదు. ఫ్రెంచి వలస రాజ్యాలు వేటిపై దౌర్జన్యం జరుగకుండా ఇంగ్లాండు శ్రద్ధ వహించుచున్నందున, ఫ్రాంసు ఇంగ్లాండుపై యుద్ధంచేయుటకు అవకాశం లేకపోయినది. ఫ్రెంచి సామ్రాజ్యంలో ఎక్కడైనా వీరుభయులకు లడాయి పెట్టాలని జర్మనులు ప్రయత్నిస్తున్నారు.

గెలిచిన జర్మనీ, యూరోపునుండి తనను పూర్తిగా రూపుమాపలేదని ఫ్రాంసు కృతజ్ఞత తెలుపుకోవలసియున్నది. అందుకే యిట్టి ఒడంబడికలు గావించుకొంటున్నది. చిట్టచివరకు లావెలుగారు (ఆదివరకు ప్రధాని) పెటేను ప్రభుత్వం మనసులో ఉన్నది బయటపెట్టిరి. నిరుద్యోగం, దారిద్ర్యం అరాచకం తొలగించి సోషలిజం వృద్ధిచేయుటకు శాంతి వుండాలి. జాతీయ పునరుద్ధరణ కార్యమునకు అమెరికా అడ్డుతగులునా? అని లావెలుగారంటున్నారు. ఏమి పునరుద్ధరణ? జర్మనీకి శాశ్వతంగా బానిసగావుండటం పునరుద్ధరణ కాబోలును? అమెరికానుండి యుద్ధ సామగ్రి తూర్పు మధ్యధరాసముద్ర ప్రాంతాలకు పోవుటకు మార్గంలో ఉన్న స్వతంత్ర ఫ్రెంచి సామ్రాజ్య భాగములగు చాడ్, ఫ్రెంచి ఈక్వటోరియాలు ఆఫ్రికాలను తాను ఆక్రమించుటకు అడ్మిరలు డార్లాను నిశ్చయించినట్లు తెలిసెను. ఈ దేశద్రోహులకవి అందనీయనని జనరలు డిగాల్‌గారు పట్టుదలతో ఉన్నారు.

స్వతంత్ర ఫ్రెంచి సేనానాయకుడగు డిగాల్‌గారు, ఫ్రెంచి ప్రభుత్వం జర్మనీచేత కీలుబొమ్మయినదనియు, వారి ప్లానులు పడగొట్టుటకు బ్రిటను చర్యలన్నింటికి తాము తోడ్పడెదమనియు చెప్పిరి. పెటేను ప్రభుత్వం శత్రువుకి లొంగిపోవడం యిష్టంలేక సిరియాలోని ఫ్రెంచి సేనానాయకుడు మరికొందరితోగూడ సిరియావిడచి ట్రాన్స్‌జోర్డానియాలోనికి పారిపోయెను. ఫ్రెంచి సేనలుగూడ విడచిపోవుచున్నవి. ఫ్రెంచి ప్రజలు పెటేను ప్రభుత్వమును ఆమోదించుటలేదు. జర్మనీతో షరీకు అవడం వారికిష్టంలేదు. ప్రతి వీధిలో డిగాల్ చిహ్నాలే చెక్కబడుచున్నవి. పెటేను వృద్ధుడయాడని, జర్మనీ ఒత్తిడికి లొంగి దేశద్రోహం చేస్తున్నాడని అందరు భావించుచున్నారు.

## రషియా - జర్మనీ

రషియా-జర్మనీలు క్రొత్తగ ఒక ఒడంబడిక చేసికొనుటకు రాయబారాలు జరుపుచున్నవని కొన్ని రోజులాయి వార్తలు వచ్చుచున్నవి. హిట్లరుకి గోధుమలు, చమురు రషియానుండి కావాలి. కావున అవియును, మధ్యప్రాచ్య దేశ యుద్ధమునందు సైనికసహాయమును యిస్తే పెర్షియను గల్ఫు ప్రాంతం అంతా రషియాకు విడచిపెడతానని ఆశలు పెట్టుచుండవచ్చును. ఇండియా, జపానులుకూడ రషియా అధికారానికి విడుస్తాననవచ్చును. యూరోపులోని రషియా సరిహద్దు మార్చకుండా ఉంచే పూచీపైని, ఇరాను ద్వారా పెర్షియను గల్ఫునకు ఒక మార్గంకూడ రషియాకు యిస్తానని యనవచ్చును. అమెరికా యుద్ధంలో చేరుతుందేమో అన్న భయంతో యూరోపు అంతటితోపాటు రషియా ముడిపస్తువులుగూడ తన వశం చేసుకోవాలని హిట్లరు యత్నం చేస్తున్నాడు.

1940 సం॥లో రషియా యివ్వవలసినంత చమురును జర్మనీకి యివ్వలేదు. అందుచే యీ రెండు దేశాలకు చెడ్డదనే చెప్పవచ్చును. జర్మనీయొక్క యంత్ర సైనికశక్తి స్టాలినుకు (రషియా నియంతకు) భయం కలిగిస్తున్నవి. ఉక్రైను ఆక్రమించుటకు హిట్లరు తయారవుతున్నాడు స్టాలిను కొంత వ్యవధి అభిలషిస్తున్నాడు. అదికిముందు రషియాను చెదరగొట్టేమేయని జర్మనీ విచారిస్తున్నది. ఇటీవల రషియాలో జర్మనీ ప్రచారం తగ్గింది. కావున ఉభయులు ఏదేని ఒడంబడికకు సిద్ధంగానే ఉన్నారు. టర్కీతో రాజకీయ సంబంధం తెగగొట్టుకొని, ఇరాకులో తిరుగుబాటు ప్రభుత్వం అంగీకరించి, ఇరాను ఆఫ్గనిస్థానములపైబడి, బ్రిటిషు సేనలను తరిమివేయాలని రషియాను జర్మనీ కోరియుండును. ఇటీవల ఇరాను సరిహద్దులవద్ద కేషుకంటులో రషియా సైన్యవిన్యాసములు చూస్తే, యిటువంటి ఒప్పందం ఏదో జరిగియుండుననే తోస్తున్నది. అపుడు ఇరాను (పెర్షియా) రషియా అధీనమందుండును. స్టాలినుకి పర్షియా గల్ఫు ప్రాంతాల ఆధిపత్యం వచ్చును. బ్రిటిషు సేన ఇండియాలో ఎక్కువగ ఉండునట్లు చేయును కాని ముస్ముందు యీతడు జర్మనీకి యింకా ఎక్కువ సౌకర్యాలను యివ్వవలసివచ్చును. యుద్ధంలో దిగకుండానే యితర విధాల భయపెట్టి రషియాలోని సరకును జర్మనీ సంపాదించును. స్టాలిను తనలోతు తెలుసుకొని, జర్మనీతో శత్రుత్వం లేకుండుటకై, ఎన్ని ఎక్కువ సౌకర్యాలేనాయిచ్చును. కాని ఇరాను ఆఫ్గనిస్తాను ఇండియాలపై పడాలను దురుద్దేశం రషియాకు ఉందని చెప్పడానికి ఎట్టి ఆధారమగు పడదు.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.